ప్రతులు : 1000

వెల : రూ.

ముద్రణ : ఫిబ్రవరి 1992

పాలిమార్ ప్రింటర్స్, ఉరవకొండ

ప్రతులకు :- **B. MD. KHAJA,**
Writer
D. No. 4-2-87,
URAVAKONDA - 515 812.
Anantapur Dist. [A. P.]

# సత్యసాయి గానామృతం



రచన:

బి.యం.డి. ఖాజా

# అ ం కి త ం

"నా జీవితం - నా సందేశం"
అనే నిత్య సందేశాన్ని పాప
భూయిష్టమైన యీ లోకానికి
అందించిన ప్రేమమూర్తి
భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయిబాబాగారి
పవిత్ర చరణాలకు
భక్తితో అంకితం.

- రచయిత

# కృతజ్ఞతలు

"సత్యసాయి గానామృతం" అనే ఈ పుస్తక ప్రచురణ కోసం తమ పూర్తి సహకారాన్ని అందించి, తమ అమూల్య సల హాలు యిచ్చి ఈపుస్తకం వెలుగులోకి రావడానికి చేయూతనిచ్చిన సహృదయులు భగవాన్ సత్యసాయి సేవాసమితి ఉరవకొండ సాయి భక్తులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ పుస్తకం వ్రాయడానికి ప్రేరణ కల్పించిన, నన్ను అడుగడుగునా ప్రతి వాక్యంలో, కన్పించి, ఉత్తేజపరచిన అవతార మూర్తి భగవాన్ సత్య సా యి బా బ పాద పద్మాలకు నమస్సుమాంజలి.



బి.యం.డి. ఖాజా
రచయిత

# ముున్నుడి

జీవితంలో మనం ఎన్నో స్వప్నాలు చూస్తాము. అన్నీ నిజ స్వరూపాలుకావు. ఎన్నో ఊహా సౌధాలు నిర్మించుకొంటాం అన్నీ వాస్తవిక రూపాలు ధరించవు.

స్వప్నం సత్యంకాదు ఈ జీవితం నిత్యం ఉండదు మానవులు మరణిస్తారు స్వప్నాలు క్రమశః స్మృతిపథం నుండి తొలగిపోతాయి. మానవులు అమరులు కారు, స్వప్నాలు శాశ్వతంకావు భగవాన్ సత్యసాయిబాబా గురించి వ్రాయాలనే ప్రేరణ కల్గింది. అయితే ఈ ప్రేరణ కల్పించిన మనోజ్ఞమూర్తి సర్వమత సామరస్య ప్రేమమూర్తి "సత్యసాయి గానామృతం"గా రచించిన ఈ వచన కవితను భక్తి జనకోటి ఆదరిస్తారని ఆశిస్తున్నాను.



వినండి వినండి సత్యసాయి చరితను
కనండి కనండి కనువిందు రూపాన్ని

ఉషఃకాల సమయాన శేషతల్పాన
తెల తెలవారుతున్న సోమవారాన
కోటి సూర్య కిరణాలు వెదజల్లు
దైవ స్వరూపి సత్యనారాయణుడు జనించాడు

॥వినండి॥

దైవభక్తి స్వరూపులు వెంకప్ప ఈశ్వరాంబలకు
జన్మించాడు పుట్టపర్తిలో బాలసాయి
ఒకఅన్నకు తమ్ముడుగా ఒకతమ్ముడికి అన్నగా
ఇద్దరక్కలకు ముద్దులతమ్ముడిగా పెరిగాడు.

॥వినండి॥

ఎనిమిదేళ్ళ చిరుప్రాయంలో
ఉపాధ్యాయుని ద్వంద నీతికి
ఎదురు తిరిగాడు సిరిచుక్క దెబ్బకు
ఇది ఆనాటి ప్రాథమిక విద్య

॥వినండి॥

పట్టంకాని పట్నం బుక్కపట్నంలో
ప్రాథమిక విద్యాభ్యాసం జరిగింది
స్నేహానికి విలువ ప్రేమకు పవిత్రత
సర్వమానవ కళ్యాణానికి నాంది పల్కింది

॥వినండి॥

సంధ్యా సమయాన చిత్రావతి తీరాన
భక్తులకు చూపారు బాబా మహిమలెన్నో
భగవానుడు మానవుడై అవతరించాడన్నారు
షిర్డి సాయి రాముడిచ్చటనే వున్నారు

॥వినండి॥

చేరాడు అన్న వదినెలతో ఉరవకొండకు
ఎనిమిదో తరగతిలో పేర్రాజు శిష్యుడయ్యాడు
కరిబసవ రాజేంద్రుల ఉన్నత పాఠశాల
ప్రపంచ చరిత్ర పుటల్లో నిలిచి పోయాడు

॥వినండి॥

తెలు కుట్టినొకనాటి రాతిరి
సత్యసాయి సర్వ శక్తులతో సూక్ష్మగ్రాహిగా మారాడు
విజ్ఞాన కాంతి రేఖలు వెల్లివిరిసె
పసుపు కుంకుమల ప్రసాదాలతో దర్శనమిచ్చాడు

॥వినండి॥

బాలబాబా మహిమలతో
పునీతమైపోయె పుడమితల్లి
"సత్యం" ప్రత్యక్ష దైవమని
ఉరగాద్రి ప్రజలు గ్రహించారు, విశ్వశించారు

॥వినండి॥

ఓం నమో నారాయణ స్మరణలతో
బాబాజీ హస్త విభూతి మహిమతో
దయ్యాలు, భూతాలు. చేతబడి మటుమాయం
కనుచూపులో కరుణ, ఛిరునవ్వులో ప్రేమజల్లు

॥వినండి॥

సత్యం ధర్మం శాంతి ప్రేమ నిలయమై
పుట్టపర్తిలో ప్రశాంతి నిలయం వెలసింది
ఆసేతు హిమాచలం సర్వమతం ఒక్కటని
సత్యసాయి పాద స్పర్శతో కనువిప్పు కల్గింది

॥వినండి॥

జీవితం క్షణ భంగురమని
సర్వమతాల సారం ఒక్కటేనని
రాగ ద్వేషాలను దుష్టగుణాలు వదలాలని
సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ అన్నారు

॥వినండి॥

సాంఘిక సేవకు కంకణ ధారివై
అజ్ఞానాంధకారంలో జ్ఞానజ్యోతి వెలిగించావ్
భారతావనిలో నిరక్షరకులుండరాదని
యూనివర్సిటీలెన్నో కట్టించావు "అనంతలో"

॥వినండి॥

"నేను" అన్న అహం వద్దన్నావ్
వారే వీరు – వీరే వారు ఔతారన్నావ్
వెంకటగిరిలో ఆత్మబోధన చేశావ్
ఐహిక సుఖాల వ్యామోహం వద్దన్నావ్

॥వినండి॥

సనాతన సారథి నీవేనయ్యా
భవరోగ వైద్యం చేశావయ్యా
ప్రశాంతి నిలయంలో కాలిడితే
స్వర్గ ప్రాప్తికది సోపానమయ్యా

॥వినండి॥

సత్యం శివం సుందరం నీవేనయ్యా
ప్రేమ మూర్తివి దత్తాత్రేయుడు నీవేనయ్యా
పాపుల పాలిటి పరమాత్మవు నీవేనయ్యా
లీలావిహారి జ్ఞానజ్యోతివి నీవేనయ్యా

॥వినండి॥

కరుణారస పూరితమైన నీదుకథ
హిందూ దేశమునందే కాదు
భూ ప్రపంచమంతట ప్రకాశించే
నీ మధురామృత దివ్యబోధనలు

॥వినండి॥

"అంతా నాదనే" స్వార్థ పూరితులైనవారికి
అణువులు పరమాణువులు కూడా నీది కాదన్నావ్
మలినమైన ఈ శరీరం క్షణభంగురమన్నావ్
పుణ్యమొక్కటే నీవెంట వస్తుందన్నావ్.

॥వినండి॥

పూర్ణ చంద్రుని భవనాన
వెలిసింది సర్వమత సమరసస్థూపం
ఆధ్యాత్మిక అధ్యయన వేదికది
సత్యసాయి బోధనలకు ఆలవాలం

॥వినండి॥

అనురాగామృత భాండం సత్య సందేశం
పాంచ భౌతిక మానవ రూపాన్ని పరమాత్ముడన్నావ్
తాత్త్విక విజ్ఞానం జీవకోటి కందించావ్
సచేతనమైన ప్రేమ పుష్పాన్ని సమాజానికందించావ్

॥వినండి॥

దైవభక్తి జీవన్ముక్తి ఆత్మప్రవక్తి నీవేనయ్యా
అకళంక దేశభక్తిని మానవకోటి కందించావ్
విశ్వమానవ సౌభ్రాతృత్వం ధర్మరక్షణ అన్నావ్
లోకా సమస్తాః సుఖినోభవంతనని ధర్మబోధన చేశావ్

॥వినండి॥

హిందూ ధర్మాన్ని పాశ్చాత్యుల కందించావ్
సనాతన ధర్మబీజాన్ని పునః ప్రతిష్ఠించావ్
పరదేశీయుల హృదయాల్లో ప్రేమజ్యోతి వెలిగించావ్
దివ్యయోగ శక్తిచే సత్యభగవానుడయ్యావ్

॥వినండి॥

శ్రీనగర్‌లో ఓ పసిబిడ్డను యోగిని చేశావ్
వజ్ర వైఢూర్యాల ఉంగరాన్ని బిడ్డ తండ్రికందించావ్
కాశ్మీర్ భక్తులకు దర్శనమిచ్చిన కారుణ్య మూర్తివయ్యా
హిమగిరిపై కాలిడి మంచు గడ్డలతో ఆడుకొన్నావ్

॥వినండి॥

శివరాత్రి ఉత్సవాల పూలమాలల్లో
విడదీసిన పూలరేకులనుండి పిప్పెరమెంట్లు
షిర్డి బాబా ఫొటోలు జన సమూహంపై చల్లావ్
సాయిరాం హస్త విభూతి తో రోగనివారణ చేశావ్

॥వినండి॥

భారద్వాజ గోత్రుడు సత్యనారాయణుడు నీవేనయ్యా
సత్య జీవితం నిత్య సందేశమిచ్చే సత్యసాయి నీవేనయ్యా
షిర్డి బాబావు శివరూపం నీదేనయ్యా
ఓంకార నాదాన్ని సర్వలోక ప్రభావిత నినాదంమిచ్చావయ్యా

॥వినండి॥

నీ మధుర కంఠస్వరం ఆరుభాషల్లో
పదలాలిత్యం పదప్రయోగం పలికింది
శ్రోతల హృదయ ఫలకాలపై చెక్కినట్లు
నీ ఉపన్యాసం మానవ జీవితాలకు అమృతవర్షం

॥వినండి॥

దత్తాత్రేయ అవతార మూర్తివి నీవేనయ్యా
దివ్యయోగివి, భోగివి, త్యాగివి నీవేబాబా
ధ్యానవాహిని, జ్ఞానవాహిని భక్తులకు పంచితివయ్యా
భక్తి జ్ఞాన వైరాగ్యాదుల నుపదేశించితివయ్యా

॥వినండి॥

గృహస్థ జీవనం ఆధ్యాత్మిక
జీవనానికి గురువన్నావ్
ఆత్మబలం ఉత్తమోత్తమైనదన్నావ్
మాధవుడై మానవసేవ కేతించినావ్

॥వినండి॥

బదరికాశ్రమం జోషి మఠంనందు
భక్తులతో కుడిచి వాళ్ళను పునీతం చేశావ్
ఆదిశంకరాచార్యుల భగవద్గీతల
బ్రహ్మ సూత్రములకు భాష్యం చెప్పావ్

॥వినండి॥

కైలాసంనుండి నేత్రలాసానికి
గంగోత్రినుండి గంగాజలం
రజిత కుంభాన్ని హస్తమున జూపి
శివలింగాన్ని అభిషేకం చేశావ్

॥వినండి॥

వృద్ధాప్య దశ సమీపిస్తుంది
దైవానుగ్రహ సాక్షాత్కారానికి
రాబోవు క్షణము నమ్మకం లేదన్నావ్
ఒక్క క్షణం హరించుకోబోతుందని నిరూపించావ్

॥వినండి॥

శాంతి సౌభాగ్యాలతో తులతూగు
రాగ ద్వేష రహితుడివై
కామ క్రోధాలను జయించి
సాధు సత్పురుష అనుగ్రహం పొందన్నావ్

॥వినండి॥

విశ్వానికే వేగుచుక్కవు నీవు
సంస్కృతి విశిష్టతను వేనోళ్ళ
పొగిడే ఆధ్యాత్మిక సందేశాలు
సాంప్రదాయానుగుణంగా చెప్పావు నీవు

॥వినండి॥

విజయదశమి, శివరాత్రి గురుపౌర్ణమిల
ప్రాముఖ్యత అంతరార్థాలు తెలిపావు
కృష్ణపక్ష చతుర్దశి మనోవృత్తుల నిరోధించావ్
మానవ హృదయాంతరాళాల్లో నిలిచిపోయావ్

॥వినండి॥

శివరూప సారథోపాసకుడు నీవయ్యా
భవరోగ వైద్యం కుదుర్చ వచ్చిన వైద్యుడవు నీవు
భక్తుల కష్టాలు తొలగించే శక్తిస్వరూపుడవు నీవయ్యా
ప్రత్యక్షపూజకన్న మానసికపూజ మహత్తరమన్నావ్

॥వినండి॥

భయము, దౌర్బల్యాన్ని పారద్రోలాలని
ధైర్యం, ఉత్సాహం ఆనందం ఉండాలని
దురలవాట్లకు దూరంగా మసలుకోవాలని
జ్ఞానబోధన చేసిన జ్ఞాన జ్యోతివి నీవయ్యా

॥వినండి॥

శ్రీ వైకుంఠ ఏకాదశి దినాన
నీనుండి సృష్టించబడు అమృతం
భక్తుల ననుగ్రహించుట అబ్బురం
నీ వెళ్ళనుండి స్రవించు భాగ్యం అమృతం పొందె

॥వినండి॥

తులసి మాలలుకట్టిరి భక్తులు /
నీ పాత మందిరాన తులసినంత
సరిపోయె మాలకై అచట తులసి
చాలదా అదినేని తిరిగి బుట్టలో సృష్టించితివి

||వినండి||

నేనే షిర్డిబాబానని అనచేతివి
ఫోటోలతో ప్రత్యక్ష సాక్ష్యము చూపితివి
భక్తుల సందేహాలు సమయింప జేసితివి
అష్టోత్తర శతనామావళి అక్షరరూపం నీవయ్యా

||వినండి||

జన్మ జన్మలకైన మరువ తరమానీ
కరుణ పూరిత చిరునవ్వు మొము
భిన్నరూపాలతో దర్శనమిచ్చుచు
భక్తులను కాపాడుతున్న కారుణ్య మూర్తివి

||వినండి||

బాబా నీ విభూతి సృష్టిని
సత్యసాయి కృపావృష్టిగా
ప్రేమావతార స్వరూపనిష్ఠిగా
సమస్త భూతాంత రాత్మవునీవుగాక వేరెవరయ్యా

॥వినండి॥

విభూతిని నుదుటపెట్టి
నీ భక్తుడు దీక్షిత్ ని "వాడా" కు
పొమ్మని మొటిక్కాయ కొట్టి పంపావు
కఠువైన తలనొప్పిని మటుమాయం చేశావ్

॥వినండి॥

మానవులత్యాశతో కూడి పరస్పర
ద్వేషాసూయలతో కాలాన్ని నెట్టుతున్నా
అవిధేయత, సాంఘిక దురాచారాలు
తలలెత్తి విజృంభించినా నీవు మిన్నకున్నావ్

॥వినండి॥

సర్వకాల సర్వావస్థలందు సాయీ
నీ నవనవోన్మేష భాషణములతో
భక్తుల మనస్సులను రంజింపజేయుచూ
సమ్మోహన మూర్తివై విలసిల్లుతున్నావయ్యా

॥వినండి॥

అష్టైశ్వర్యములు ఫలపుష్పాది కానుకలంటే
సత్య, ధర్మ, శాంతి ప్రేమలు కానుకగా సమర్పించమన్నావు
బాహ్యభక్తి కన్నా అంతర్గత పూజ కావాలన్నావ్
ధనిక పేదలను భేదాలు, తేడాలు లేవన్నావ్

॥వినండి॥

కర్మచేత జ్ఞానంబు కలుగు గాని
జ్ఞాని యొనరించుకర్మ అజ్ఞాని కొరకేనని
పూజ్యులరసిన మార్గమ్ము పూని రేని
ఆత్మజ్ఞానంబు యలవడు అవనిలోన

॥వినండి॥

చేసిన మేలు మరిచి కీడు తలపెట్టేవాడికి
ఆత్మక్లేశము కలిగించి తిరిగి మేలుచేయ్
అజన్మదాసుడు ఔతాడు కీడు తలపెట్టేవాడు
అతడు కీడు చేసినందుకు పరోపకారం చేయ్

॥వినండి॥

వైరాగ్యం అంటే ఆలు బిడ్డల్ని
విడచి పెట్టడం కాదన్నావ్
కాషాయ వస్త్రాలు ధరించడం కాదన్నావ్
కళ్ళు మూసుకొని అడవుల్లో కూర్చుంటే ముక్తిరాదన్నావ్

॥వినండి॥

బ్రహ్మవితే బ్రహ్మైవ భవతి
బ్రహ్మజ్ఞాన ప్రాప్తి చెత బ్రహ్మమే ఔతాడన్నావ్
బ్రహ్మలోన నీవు నీలో బ్రహ్మముండ
బ్రహ్మకు నీకు భేదంబు లేదని తెలియ జెప్పావు

॥వినండి॥

తీరని కోరికలు పుట్టుకొచ్చినపుడు
జీవులను బలివ్వడంకాదు మొక్కుబడి
బలి అంటే "కప్పం" సుంకం అన్నావ్
మూగజీవాలకు స్వేచ్ఛ ఇవ్వాలన్నావ్

॥వినండి॥

మానవుడూ దైవాంశ సంభూతుడే
ఆది మధ్యాంతరహితుడే నన్నావ్
కామ క్రోధ లోభ మోహాలనుజయించమన్నావ్
మానివుని శక్తేమిటో తెలుసుకోమన్నావ్

॥వినండి॥

ఆఫ్రికాలో ఆనంద సాయివి
నైరోబిలో నందలాలనైతివి
యుగాండాలో దివ్య శక్త్యానుభూతి బొందితో
టాంజానియాలో హస్త విభూతితో పావనం చేశావ్

॥వినండి॥

వైద్యరంగంలో పుట్టపర్తి
మహూన్నత శిఖరాగ్రాన్ని తాకింది
విద్య వైజ్ఞానిక రంగాలలో
అంతర్జాతీయ స్థాయికెదిగింది

॥వినండి॥

అల్లా ఈశ్వర్ సాయిరాం నీవేనయ్యా
నీ దివ్యబోధనలు పాటించడం
మానవాళికి మోక్ష ప్రబోధమయ్యా
నీ దృష్టిలో సంపన్నులైనా దరిద్రులైనా ఒకటేనయ్యా

॥వినండి॥

